మహారాజ
శ్రీ పోవూరి శ్రీరామమూర్తి
భార్య కమలాదేవి

బ్రహ్మశ్రీ పోవూరి సుబ్రహ్మణ్యరామకృష్ణ, యం.యస్.సి.,
భార్య వెంకట కామేశ్వరి

ద్వితీయపుత్రుడు చిరంజీవి వేంకట సుబ్రమణ్యము
కుమార్తె చి॥ల॥సౌ॥ శ్రీదేవి
కొల్లూరు సుబ్రమణ్యము,గంగాధర రామరావు

ఉచితముగా ప్రతులు పొందగోరువారు :
అజంతా పబ్లిషింగ్‌హౌస్
విద్యావిషయక ప్రచారకులు
7వ లైను, అరండల్‌పేట,
గుంటూరు - 500 002.

# ఆమోదము

**శాస్త్రుల భార్గవరామశర్మ**, లెక్చరర్ శ్రీ దుర్గేశ్వర మహిళా సంస్కృతకళాశాల, వరంగల్లు

తెలుగుజాతి గర్వించదగిన మహాకవులలో ధూర్జటి యొక శివార్కమణి దీపము ఇతని రచనలు ముఖ్యముగా రెండు. **1. శ్రీకాళహస్తి మహాత్మ్యము. 2. శ్రీకాళహస్తీశ్వర శతకము.** ఇవి రెండూ నివృత్తి లక్షణ ధర్మము భూమికగా గల భక్తి రస కావ్యములే. కాని ఇహాముత్రఫలభోగ వైరాగ్యతీవ్రత, శివేతర తిరస్కార వ్యగ్రత శతకములో నున్నట్లు మహాత్మ్యములో కన్పడదు. దీనికి కారణము కావ్య పరిధులు, లేదా వయో భేద మూలకమైన జీవితానుభవము ప్రసాదించిన పరిణత నిత్యానిత్యవస్తు వివేకశాలియైన యంతఃకరణ వైశద్యము గాని గావచ్చును. ఏమైనను జీవిత చరమాంకములో అన్ని అనుబంధాలను తెంచివేసుకొని గారుడ విహంగ వీక్షణమున లోకమునందలి గుణదోషములను నిర్భీతిగ నెలుగెత్తి చాటి "శ్రీకాళహస్తీశ్వరా" యను సప్తాక్షరీ మహామంత్ర మకుటము ద్వారా "శివ ఏకో" ధ్యేయః సర్వమన్యత్పరిజ్య అను ఉపనిషత్పర మార్థమును మేళవించి సుకవితా మాధురీ రసగంగను తెలుగు సాహిత్యవీధిలో ప్రవహింప జేసిన ధూర్జటి నిజముగా అపర ధూర్జటియే.

శతకాను బంధముగా గూర్చిన "శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా స్తోత్రము" వలన ఈ గ్రంధమునకు వాగర్థ సామరస్య పరిపుష్టి సమకూరినది.

"దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపి శివే" యని నే జేయు ప్రాతఃస్మరణము వలన శ్రీజ్ఞాన ప్రసూనాంబికాదేవి ఈ గ్రంథమునకు కతిపయాక్షర విలాస విభ్రమమును కలిగించు సౌభాగ్యమునను గ్రహించినదని భావించుచున్నాను.

ఈ సారస్వత సేవలో మమ్ములను గూడ ధన్యులను జేసిన ప్రకాశకులు శివశ్రీ ముదిగొండ విశ్వనాథము దీనికి ఆర్థిక పుష్టిని యొసంగించిన బ్రహ్మశ్రీ పోపూరి శ్రీరామమూర్తిగారికి, వీరు బదరీ, వారణాసి, శ్రీశైలము, భద్రాచలములో భక్తులకు అన్నము ఏర్పాటుచేసిన మహనీయులు ఎంతో ప్రశంసనీయులు.

చదువరులకు "జ్ఞానలక్ష్మీజాగ్రత్పరిణామమ్ము" నిమ్మని యనాది మిథునమ్ము నర్థించుచున్నాను.

మహాకవి ధూర్జటికృత

# శ్రీ కాళహస్తీశ్వర శతకము

శ్రీ విద్యుత్కలితాజవంజవ మహాజీమూత పాపాంబు ధా
రా వేగంబున మన్మనోబ్జ సముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా ! నీ కరుణాశరత్సమయ మింతే చాలు; చిద్భావనా
సేవన్ దామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా ! 1

వాణీవల్లభ దుర్లభం బగు భవద్ద్వారంబునన్ నిల్చి ని
ర్వాణశ్రీఁ జెరపట్టఁ జూచిన విచార ద్రోహమో నిత్య క
ల్యాణ క్రీడలఁ బాసి దుర్దశలపాలై రాజలోకాధమ
శ్రేణీ ద్వారము దూఱఁజేయఁగత మోశ్రీకాళహస్తీశ్వరా ! 2

అంతా మిథ్య తలంచి చూచిన నరుం డట్లౌ టెఱింగిన్ సదా
కాంత ల్పుత్రులు నర్థమున్ తనువు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతింజెంది చరించుఁగాని పరమార్థంబైన నీయందుఁ దాఁ
జింతాకంతయుఁ జింత నిల్పఁడుగదా! శ్రీకాళహస్తీశ్వరా ! 3

నీనా సం దొడబాటుమాట వినుమా నీచేత జీతంబు నేఁ
గానిం బట్టక సంతతంబు మది వేడ్కన్గొల్తునంత స్సప
త్నానీకంబున కొప్పగింపకుము నన్నాపాటియే చాలుఁ దే
జీ నొల్లన్ గరి నొల్ల నొల్ల సిరులన్ శ్రీకాళహస్తీశ్వరా! 4

భవకేళీమదిరా మదంబున మహాపాపాత్ముఁడై వీఁడు న
న్ను వివేకింపఁ డటంచు నేను నరకార్ణోరాశిపాలైనఁ బ
ట్టవు బాలుండొకచోట నాటతమితోడన్ నూతఁగూలంగఁ దం
డ్రి విచారింపక యుండునా ? కటకటా! శ్రీకాళహస్తీశ్వరా ! 5

స్వామిద్రోహము చేసి వేఱొకనిఁ గొల్వంబోతినో ? కాక నే
నేమాట న్వినన నొల్లకుండితినొ? నిన్నే దిక్కుగాఁజూడనో ?
యేమీ ! యిట్టి వృథాపరాధి నగు నన్నీ దుఃఖవారాశి వీ
చీ మధ్యంబున ముంచి యుంపనగునా ? శ్రీకాళహస్తీశ్వరా ! 6

దివిజ క్ష్మారుహ ధేనురత్న ఘనభూతి ప్రస్ఫురద్రత్న సా
నువు నీవిల్లు నిధీశ్వరుండు సఖుఁ డర్ణోరాశికన్యావిభుం
డు విశేషార్చకుఁడింక నీకెన ఘనుండుం గల్గనే నీవు చూ
చి విచారింపవు లేమి నెవ్వఁడుడుపున్ ? శ్రీకాళహస్తీశ్వరా ! 7

నీతో యుద్ధముఁజేయ నోపఁ గవితానిర్మాణశక్తి న్నినుం
బ్రీతుం జేయఁగలేను నీకొఱకుఁ దండ్రిం జంపఁగాఁజాల నా
చేత న్రోఁకట నిన్ను మొత్త వెఱతున్ జీకాకు నాభక్తి యే
రీతి న్నాకిఁక నిన్ను ఁజూడఁగలుగున్ శ్రీకాళహస్తీశ్వరా ! 8

ఆలుంబిడ్డలుఁ దల్లిదండ్రులు ధనం బంచున్ మహాబంధనం
బేలా నామెడఁ గట్టినాఁడ విఁక నిన్నేవేళఁ జింతింతు ని
ర్మూలంబైన మనంబులోనఁగడుదుర్మోహాబ్ధిలోఁగ్రుంకి యీ
సీలామాలపుఁజింత నెట్లుడిపెదో శ్రీకాళహస్తీశ్వరా ! 9

నిప్పై పాతకతూలశైల మడఁచున్ నీనామ మేమానవుల్
తప్పన్దవ్వుల విన్న నంతకభుజాదర్పోద్ధతక్లేశము, ల్తప్పున్
దారును ముక్తులౌదురని శాస్త్రంబు ల్మహాపండితుల్
చెప్పంగాఁ దమకింక శంక వలెనా ? శ్రీకాళహస్తీశ్వరా ! 10

వీడెంబబ్బినయప్పుడున్ దమ నుతుల్ విన్నప్పుడున్ బొట్టలోఁ
గూడున్నప్పుడు శ్రీవిలాసములుపై కొన్నప్పుడు న్నాయకుల్
పాడంగా వినునప్పుడున్ జెలఁగు దంభప్రాయ విశ్రాణన
క్రీడాసక్తుల నేమి చెప్పవలెనో శ్రీకాళహస్తీశ్వరా ! 11

నిను సేవింపఁగ నాపదల్ పొడమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుండననీ మహాత్ముఁ డననీ సంసారమోహంబు పై
కొననీ జ్ఞానము కల్గనీ గ్రహగతుల్ కుందింపనీ మేలు వ
చ్చినరానీ యవి నాకు భూషణములో శ్రీకాళహస్తీశ్వరా! 12

ఏవేదంబుఁ బఠించె లూత భుజగం బేశాస్త్రముల్చూచెఁ దా
నేవిద్యాభ్యసనంబొనర్చెఁగరి చెంచేమంత్రమూహించె బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా ? కావు నీపాద సం
సేవాసక్తియెకాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా! 13

కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయన్ రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయంబాయెను, బట్టగట్టెఁదల, చెప్పన్‌రోఁత సంసారమేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే! శ్రీకాళహస్తీశ్వరా! 14

నిన్నేరూపముగా భజింతుమదిలో నీరూపు మోఁకాలో? స్త్రీ
చన్నో ? కుంచమొ? మేకపెంటికయొ ? ఈ సందేహముల్మాన్పి నా
కన్నారన్ భవదీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే
చిన్నీరేజ విహార మత్త మధుపా ! శ్రీకాళహస్తీశ్వరా! 15

నిను నా వాఁకిలిగావుమంటినొ మరున్నీలాలక భ్రాంతిఁ గుం
టెన పొమ్మంటినొ యెంగిలిచ్చి తిను తింటేగాని కాదంటినో
నిను నెమ్మిం దగ విశ్వసించు సుజనానీకంబు రక్షింపఁ జే
సిన నా విన్నప మేల కైకొనవయా ? శ్రీకాళహస్తీశ్వరా! 16

ఱాలన్ ఱువ్వఁగఁ జేతులాడవు కుమారా ! రమ్మురమ్మంచు నేఁ
జాలన్ జంపఁగ నేత్రముల్ తివియఁగా శక్తుండనేఁగాను నా
శీలం బేమని చెప్పనున్న దిఁక నీ చిత్తంబు నాభాగ్య మో
శ్రీలక్ష్మీపతి సేవితాంఘ్రి యుగళా ! శ్రీకాళహస్తీశ్వరా! 17

ఋ ల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వా రిచ్చు నం
జాక్షీ చతురంతయానతురగీ భూషాదు లాత్మవ్యథా
ంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితన్ జ్ఞాన ల
జాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా! 18

రూపంబుఁ దలంపగాఁదుద మొదల్ నేఁగాన నీవైననున్
ా రమ్మనియంచుఁ జెప్పవు వృథారంభంబు లింకేటికిన్
న్మంపుము పాలముంపు మిఁక నిన్నే నమ్మినాఁడంజుమీ
ామార్చిత పాదపద్మయుగళా! శ్రీకాళహస్తీశ్వరా! 19

న్మాంసము వాంఛయేని కఱవా ? ి చేత లేడుండఁగా
ై నట్టి కుఠార ముండ ననలజ్యోతుండ నీ రుండఁగాఁ
కం బొప్ప ఘటించి చేతి పునుకన్ భక్షింపకా బోయచేఁ
కొం టెంగిలిమాంస మిట్లు తగునా ? శ్రీకాళహస్తీశ్వరా! 20

ై దుష్కృతిఁజెందెఁ జందురుఁడు, రారాజై కుబేరుండు దృ
జీవంబునుఁగాంచె దుఃఖము, కురుక్ష్మాపాలుఁడామాటనే
ాజిం గూలె సమస్త బంధువులతో, నారాజశబ్దంబు చీ
జన్మాంతరమందు నొల్లను జుమీ! శ్రీకాళహస్తీశ్వరా! 21

జర్థాతురుఁడైనచో నెచట ధర్మం బుండు? నేరేతి నా
జాతిక్రియలేర్పడున్ ? సుఖము మాన్యశ్రేణికెట్లబ్బు ? రూ
జీవాళికి నేది దిక్కు ? ధృతి నీ భక్తుల్ భవత్పాద నీ
ంబుల్ భజియింతు రేతెఱఁగునన్ శ్రీకాళహస్తీశ్వరా! 22

ఁగ ల్పిప్పలపత్రముల్ మెఱుఁగుటద్దంబు ల్మరుద్దీపముల్
కర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతకీటప్రభల్
రవీథిలిఖితాక్షరంబు లసువుల్జ్యోత్స్నామయఃపిండముల్
ు లందేల మదాంధులౌదురు జనుల్ శ్రీకాళహస్తీశ్వరా! 23

నిన్ను న్నమ్మినరీతి నమ్మ నొరులన్ నీకన్న నాకెన్న లే
రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుండాపత్సహాయుండు నా
యన్నా ఎన్నఁడునన్ను సంసృతివిషాదాంభోధిదాఁటించి య
చ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదొకదే ! శ్రీకాళహస్తీశ్వరా! 24

నీపంచం బడియుండఁగాఁ గలిగినన్ భిక్షాన్నమే చాలు, ని
క్షేపం బబ్బిన రాజకీటముల నే సేవింపఁగా నోప, నా
శాపాశంబులఁ జుట్టి త్రిప్పకుము సంసారార్థామై, బంటుగాఁ
జేపట్టం దయ కల్గెనేని మదిలో శ్రీకాళహస్తీశ్వరా! 25

నీపేరున్ భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూతతాంబూలమున్
నీపళ్లెంబు ప్రసాదముం గొనికదా నీబిడ్డఁ డై నాఁడ, న
న్నీపాటిం గరుణింపు మోపనిఁక నే నెవ్వారికిం బిడ్డఁగాన్
జేపట్టం దగుఁ బట్టి మానఁదగ దో శ్రీకాళహస్తీశ్వరా! 26

అమ్మా యయ్య యటంచు నెవ్వరిని నేనన్నన్ శివా ! నిన్ను నే
సుమ్మీ నీమదిఁ దల్లిదండ్రుల నటంచున్ చూడఁగాఁబోకు నా
కిమ్మైఁ దల్లియుఁదండ్రియున్ గురుఁడు నీవేకాన సంసారపుం
జిమ్మంజీఁకటిఁ గప్పినన్ గడపు నన్ శ్రీకాళహస్తీశ్వరా! 27

కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెన్ బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా! 28

గ్రహదోషంబులు దుర్నిమిత్తములు నీకల్యాణనామంబు ప్ర
త్యహముంబేర్కొను నుత్తమోత్తముల బాధంబెట్టఁగా నోపునే
దహనుం గప్పఁగఁజాలునే శలభసంతానంబు నీసేవఁ జే
సి హతక్లేశులు గారుగాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా! 29

అడుగంబో నిఁకనన్యమార్గరతులన్ బ్రాణావనోత్సాహినై
యడుగంబోయినఁబోదు నీదుపదపద్మారాధకశ్రేణియు
న్నెడకున్ నిన్ను భజింపఁగాఁగనియు నాకేలా పరాపేక్ష కో
రెడి దింకేమి ? భవత్ప్రసాదమె తగున్ శ్రీకాళహస్తీశ్వరా! 30

మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యముల్పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలముల్పరిమళంబుల్మోక్ష మీఁ జాలునే ?
మదిలో వీని నపేక్షచేసి నృపధామద్వారదేశంబుఁగా
చి దినంబుల్ వృథపుత్తురజ్ఞు లకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 31

రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
బాసీపాయదు పుత్త్రమిత్త్రజనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీకోయదు నామనం బకట నీకుంబ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్లణఁపవే ! శ్రీకాళహస్తీశ్వరా! 32

ఎన్నేళ్ళుండితి ? నేమి కంటి ? నిఁక నేనెవ్వారి రక్షించెదన్ ?
నిన్నే నిష్ఠభజించెదన్ నిరుపమోన్నిద్రప్రమోదంబు నా
కెన్నం డబ్బెడు ? నెంతకాల మిఁక ? నేనిట్లున్న నేమయ్యెడిన్ ?
జిన్నంబుచ్చక నన్ను నేలుకొనవే శ్రీకాళహస్తీశ్వరా! 33

చావం గాలము చేరువౌ టెఱిఁగియున్ జాలింపఁగా లేక త
న్నేవైద్యుండు చికిత్సఁబ్రోవఁగలఁడో యేమందురక్షించునో
యేవేల్పుల్కృపఁజూతురోయనుచు నిన్నింతైనఁజింతింపఁ డా
జీవశ్రాద్ధముఁ జేసికొన్న యతియున్ శ్రీకాళహస్తీశ్వరా! 34

దినముం జిత్తములో సువర్ణముఖరీ తీరప్రదేశామ్ర కా
నన మధ్యోపల వేదికాగ్రమున నానందంబునన్ బంకజా
సననిష్ఠన్ నినుఁజూడఁ గన్న నదివో సౌఖ్యంబు, లక్ష్మీవిలా
సిని మాయానటనల్ సుఖంబు లగునే శ్రీకాళహస్తీశ్వరా! 35

ఆలంచు న్మెడఁ గట్టి దానికి నపత్యశ్రేణిఁగల్పించి త
ద్బాలవ్రాతమునిచ్చిపుచ్చుకొను సంబంధంబుఁగావించి యా
మాలర్మంబున బాంధవంబనెడి ప్రేమన్ గొందఱంద్రిప్పఁగా
సీలన్ సీల యమర్చిన ట్లొసఁగితో శ్రీకాళహస్తీశ్వరా! 36

తనువే నిత్యముగా నొనర్చు మది లేదా చచ్చి జన్మింపకుం
డ నుపాయంబుఘటింపు మీగతులరెంటన్ నేర్పు లేకున్న లే
దని నా కిప్పడెచెప్ప చేయఁగల కార్యంబున్న సంసేవఁ జే
సి నినుం గాంచెదఁగాక కాలమున నో శ్రీకాళహస్తీశ్వరా! 37

పదునాల్గేలెమహాయుగంబులొకభూపాలుండు, చెల్లించెన
య్యుదయాస్తాచలసంధినాజ్ఞనొకఁడాఁయుష్మంతుడై వీరి య
భ్యుదయంబెవ్వరుచెప్పఁగావినరొ యల్పుల్మత్తులై యేల చ
చ్చెదరో రాజుల మంచు నక్కటకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 38

రా జన్నంతనె పోవునా ? కృపయు ధర్మంబాభిజాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము వి ద్వన్మిత్రసంరక్షయున్
సౌజన్యంబు కృతం బెఱుంగుటయు విశ్వాసంబు గాకున్న దు
ర్బీజశ్రేష్ఠులుగాఁ గతంబు గలదే ! శ్రీకాళహస్తీశ్వరా! 39

మును నీచే నపవర్గరాజ్యపదవీ మూర్ధాభిషేకంబు గాం
చిన పుణ్యాత్ములు నేనునొక్కసరివో ! చింతించి చూడంగ నె
ట్లనినం గీట ఫణీంద్రపోత మదవేదండోగ్ర హింసా విచా
రినిఁ గాఁగాఁ నినుఁ గానఁగాక మదిలో శ్రీకాళహస్తీశ్వరా! 40

పవమానాశనభూషణప్రకరముల్ భద్రేభ చర్మంబు నా
టవికత్వంబు ప్రియంబులై భుజగశుండాలాటవీచారులన్
భవదుఃఖంబులఁబాపు టొప్ప, చెలఁదిం బాటించి కైవల్యమి
చ్చి వినోదించుట కేమికారణమయా ! శ్రీకాళహస్తీశ్వరా! 41

అమరస్త్రీల రమించినన్గెడదు మోహంబింతయు న్బ్రహ్మప
ట్టము సిద్ధించిన నాసతీఱదు, నిరూఢక్రోధమున్ సర్వ లో
కములన్ మ్రింగిన మాన దిందుఁగలసౌఖ్యం బొల్ల నీసేవ చే
సి మహాపాతక వారిరాశిఁ గడతున్ శ్రీకాళహస్తీశ్వరా! 42

చనువారింగని యేడ్చువారు జముఁడా ! సత్యంబుగావత్తు మే
మనుమానం బిఁకలేదు నమ్ముమని తా రావేళ నా రేవునన్
మునుగం బోవుచు బాసచేయుట సుమీ ముమ్మాటికిన్జూడఁగా
చెనఁటు ల్గానరు దీని భావ మిదివో శ్రీకాళహస్తీశ్వరా! 43

భవదుఃఖంబులు రాజకీటముల నేఁ బ్రార్థించినంబాయునే ?
భవదంఘ్రిస్తుతిచేతఁగాక విలస ద్బాలక్షుధాక్లేశ దు
ష్టవిధు ల్మానునె చూడ మేఁక మెడచంటన్ దల్లిగారుణ్య దృ
ష్టి విశేషంబున నిచ్చు చంటబలె నో శ్రీకాళహస్తీశ్వరా! 44

పవి పుష్పంబగు, నగ్ని మంచగు, నకూపారంబుభూమీస్థలం
బవు, శత్రుండతి మిత్రుఁడౌ, విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలి లోపలన్ శివశివే త్యాభాషణోల్లాసికిన్
శివ ! నీనామము సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా! 45

లేవో కానలఁ గందమూలఫలము ల్లేవో గుహల్తోయముల్
లేవోయేఱులఁ బల్లవాస్తరణముల్ లేవోసదా యాత్మలో
లేవో నీవు విరక్తులన్ మనుప జాలింబొంది భూపాలురన్
సేవల్ చేయఁగఁబోదు రేలొకొ జనుల్ శ్రీకాళహస్తీశ్వరా! 46

మును నేఁ బుట్టినపుట్టు లెన్ని గలవో, మోహంబుచే నందుఁజే
సిన కర్మంబులప్రోవు లెన్నిగలవో, చింతించినన్ గాన-నీ
జననంబేయని యున్నవాఁడ నిదియే చాలింపవే నిన్నుఁ గొ
ల్చినపుణ్యంబునకున్ గృపారతుఁడవై శ్రీకాళహస్తీశ్వరా! 47

తను వెందాఁక ధరిత్రి నుండు నను నందాఁకన్ మహారోగ దీ
పన దుఃఖాదులఁ బొందకుండ ననుకంపాదృష్టి వీక్షించి, యా
వెనుకన్ నీ పద పద్మముల్ తలఁచుచున్ విశ్వప్రపంచంబుఁ బా
సిన చిత్తంబున నుండఁ జేయఁగదవే ! శ్రీకాళహస్తీశ్వరా! 48

మలభూయిష్ఠ మనోజధామము సుషుమ్నాద్వారమో యారుకుం,
డలియో పాదక రాక్షియుగ్మములు షట్కంజంబులో మోముతా,
జలజంబో నిటలంబు చంద్రకళయో సంగంబు యోగంబొ గా,
సిలిసేవింతురు కాంతలన్ భువిజనుల్ శ్రీకాళహస్తీశ్వరా! 49

జలకంబుల్రసము ల్ప్రసూనములు వాచాబంధము ల్వాద్య ము
ల్కలశబ్దధ్వను లంచితాంబర మలంకారంబు దీప్తుల్ మెఱుం
గులు నైవేద్యము మాధురీమహిమగాఁ గొల్తున్నినున్భక్తి రం
జిల దివ్యార్చన కూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా! 50

ఏలీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీ రూపమున్
జాలుంజాలుఁ గవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ ! లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా! 51

పాలుం బువ్వయుఁ బెట్టెదన్ గుడవరా పాపన్న రాయన్న లే
లే లెమ్మన్న నరంటిపండు కొని తే లేకున్న నొల్లనం
టే లాలింపరే తల్లిదండ్రు లపుడట్లే తెచ్చి వాత్సల్య ల
క్ష్మీ లీలావచనంబులన్ మనుపవే శ్రీకాళహస్తీశ్వరా! 52

కలలంచు న్శకునంబులంచు గ్రహయోగంబంచు సాముద్రికం
బు లటంచు న్దైవులంచు దిష్టమనుచున్ న్వాతంబులంచు న్విషా
దులటంచున్ నిమిషార్ధ జీవనములందున్ బ్రీతిఁబుట్టించి యీ
సిలుగుల్ ప్రాణులకెన్ని చేసితివయా ! శ్రీకాళహస్తీశ్వరా! 53

తలమీఁదం గుసుమ ప్రసాద మలిక స్థానంబుపై భూతియున్
గళసీమంబున దండ నాసికతుదన్ గంధప్రసారంబు లో
పల నైవేద్యముఁ జేర్చునే మనుజుఁడాభక్తుండు నీకెప్పుడున్
జెలికాఁడై విహరించు రౌప్యగిరిపై శ్రీకాళహస్తీశ్వరా! 54

ఆలుం బిడ్డలు మిత్రులున్ హితులు నిష్టార్థంబు లీనేర్తు రే
వాళ న్వారి భజింప జాలిపడ కావిర్భూతమోదంబునన్
గాలం బెల్ల, సుఖంబు నీకు నిఁక భక్తశ్రేణి రక్షింప కీ
శ్రీలెవ్వారికిఁ గూడఁబెట్టెదవయా ! శ్రీకాళహస్తీశ్వరా! 55

సులభుల్ మూర్ఖులనుత్త మోత్తములు రాజుల్ కల్గి యేవేళన
న్నలఁతం బెట్టిన నీపదాబ్జములఁ బాయంజాల నేమిచ్చినం
గల ధౌతాచల మేలు టంబునిధిలోఁ గావుండు టబ్జంబుపైఁ
జెలువొప్పన్ సుఖియింపఁ గాంచుటసుమీ శ్రీకాళహస్తీశ్వరా! 56

కలధౌతాద్రియు నస్థిమాలికయు గో గంధర్వమున్బున్కయు
న్బులితోలున్ భసితంబుఁ బాపతొడవుల్ పోకుండఁ దోఁబుట్లకై
తొలి నేవారలతోడఁ బుట్టవు కళాదుల్ కల్గ మేలయ్యె నా
పిలుపుల్ దూరము చేసికొంటెఱిఁగియే శ్రీకాళహస్తీశ్వరా! 57

శ్రుతులభ్యాసముచేసి శాస్త్రగరిమల్ శోధించి తత్త్వంబులన్
మతి నూహించి శరీర మస్థిరము బ్రహ్మం బెన్న సత్యంబుఁ గాం
చితి మంచున్ సభలన్ వృథావచనముల్ చెప్పంగనే కాని ని
ర్జిత చిత్తస్థిర సౌఖ్యముల్ దెలియరో శ్రీకాళహస్తీశ్వరా! 58

గతి నీ వంచుఁ దలంచువార లపవర్గంబొందఁగానేల సం
తతమున్ గూటికినై చరింప వినలేదా ! ఆయురన్నం ప్రయ
చ్ఛతి యంచున్మొఱవెట్టఁగా శ్రుతులు సంసారాంధకారాభి దూ
షిత దుర్మార్గులు గానఁ గానఁబడ వో శ్రీకాళహస్తీశ్వరా! 59

రతిరాజుద్ధతిమీఱ నొక్కమఱి గోరాజాశ్వునిన్ నొక్కఁబో
నతఁడా దర్పకు వేగనొత్తఁ గవయంబాఁబోతునుం దాఁకి యు
గ్రతఁ బోరాడఁగనున్న యన్నడిమిలేఁగ ల్పోలె శోకానల
స్థితిపాలై మొఱవెట్టినన్ మనుపవే ! శ్రీకాళహస్తీశ్వరా! 60

అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరాన్వితమె మేనంతా భయభ్రాంతమే
యంతా నంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
జింత న్నిన్నుఁ దలంచి పొందరు నరుల్ శ్రీకాళహస్తీశ్వరా! 61

సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వార సౌఖ్యంబులన్
శాంతిబొందితిఁ జాలుఁజాలు బహురాజద్వార సౌఖ్యంబుల
న్శాంతింబొందెదఁ జూపు బ్రహ్మపద రాజద్వార సౌఖ్యంబు ని
శ్చింతన్ శాంతుఁడ నౌదు నీ కరుణచే శ్రీకాళహస్తీశ్వరా! 62

స్తోత్రం బన్యులఁ జేయనొల్లని వ్రతస్థుల్పోలె వేసంబుతోఁ
బుత్త్రీపుత్రకళత్రరక్షణ కళాబుద్ధిన్ నృపాలాధమున్
బాత్రంబంచు భజింపఁబోదు రిదియున్భావ్యంబె ? యవ్వారి చా
రిత్రం బెన్నఁడు మెచ్చ నెంచ మదిలో శ్రీకాళహస్తీశ్వరా! 63

అకలంకస్థితినిల్పి నాదమను ఘంటారావమున్ బిందు దీ
ప కళాశ్రేణి వివేక సాధనము లొప్పంబూని యానంద దా
రక దుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తివారించు వా
రికిఁగా వీడు భవోగ్రబంధలతికల్ శ్రీకాళహస్తీశ్వరా! 64

ఒకయర్థంబును నిన్ను నేనడుగఁగా నూహింప నెట్లైనఁ బొ
మ్ము కవిత్వంబులు నాకుఁ జెందనివి యేమోయంటివా నాదు జి
హ్వకు నైసర్గిక కృత్యమింతియసుమీ ప్రార్థించుటేకాదు కో
రికలన్ నిన్నును గాన నాకు వశమా ? శ్రీకాళహస్తీశ్వరా! 65

శుకము ల్కింశుపుష్పముల్గని ఫలస్తోమం బటంచు స్సము
త్సుకతం జేరఁగఁబోవ నచ్చట మహాదుఃఖంబు సిద్ధించుఁగ
ర్మకళాభాషలకెల్లఁ బ్రాపులగు శాస్త్రంబు ల్విలోకించు వా
రికి నిత్యత్వమనీష దూరమగు నో శ్రీకాళహస్తీశ్వరా! 66

ఒకరింజంపి పదస్థులై బ్రతుకఁ దా మొక్కొక్కరూహింతు రే
లొకొ తా మెన్నఁడుఁజావరో తమకు బోవో సంపదల్పుత్త్ర మి
త్ర కళత్రాదులతోడ నిత్య సుఖమందంగందురో యున్నవా
రికి లేదో మృతి యెన్నఁడుం గటకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 67

నీ కారుణ్యముఁ గల్గినట్టి నరుఁ డే నీచాలయంబుం జొరం
డే కార్పణ్యపు మాట లాడ నరుగం డెవ్వారితో వేషముల్
గైకోఁ డేమతము ల్భజింపఁడిల నేకష్టప్రకారంబులన్
జీకాకై చెడిపోఁడు జీవనదశన్ శ్రీకాళహస్తీశ్వరా! 68

జ్ఞాతుల్ద్రోహులు వారు సేయు కపటేర్ష్యాది క్రియాదోషము
ల్మా తండ్రాన సహింపరాదు ప్రతికర్మంబించుకేఁ జేయఁగాఁ
బోతే దోషము గాన మాని యతినై పోఁగోరినన్ సర్వదా
చేతః క్రోధము మానదెట్లు నడతున్ ? శ్రీకాళహస్తీశ్వరా! 69

చదువుల్ నేర్చిన పండితాధములు స్వేచ్ఛాభాషణ క్రీడలన్
వదరన్ సంశయ భీకరాటవులఁ ద్రోవ ల్దప్పి వర్తింపఁగాఁ
మదన క్రోధకిరాతు లందుఁగని భీమప్రౌఢి వేఁదాఁకినం
బెదరుం జిత్తము చిత్తగింపఁగదవే ! శ్రీకాళహస్తీశ్వరా! 70

రోసిం దేటిది రోఁత లేటివి మనోరోగస్థుఁడై దేహి తాఁ
బూసిం దేఁటిది పూఁత లేటివి మదాపూతంబు లీదేహముల్
మూసిందేటిది మూఁతలేటివి సదా మూఢత్వమేకాని తాఁ
జేసిం దేఁటిది చేఁత లేఁటివి వృథా శ్రీకాళహస్తీశ్వరా! 71

శ్రీశైలేశు భజింతునో యభవుఁ గాంచీనాథు సేవింతునో
కాశీవల్లభుఁ గొల్వబోదునొ మహాకాళేశుఁ బూజింతునో
నాశీలం బణువైన మేరువనుచున్ రక్షింపవే నీకృపా
శ్రీ శృంగార విలాస హాసములచే శ్రీకాళహస్తీశ్వరా! 72

అయవార్లై చరియింపవచ్చుఁ దనపాదాంభోజ తీర్థంబులన్
దయతోఁ గొమ్మనవచ్చు సేవకునియర్థ ప్రాణదేహాదుల
న్నియు నా సొమ్మనవచ్చుఁగాని సిరుల న్నిందించి నిన్నాత్మ ని
ష్క్రియతంగానఁగరాదు పండితులకున్ శ్రీకాళహస్తీశ్వరా! 73

మాయాజాండకరండకోటిఁ బొడిగా మర్దించిరో విక్రమా
జేయుం గాయజుఁ జంపిరో కపటలక్ష్మీ మోహముం బాసిరో
యాయుర్దాయ భుజంగ మృత్యువు ననాయాసంబు నన్గెల్చిరో
శ్రేయోదాయకు లౌదు రెట్టు లితరుల్ ? శ్రీకాళహస్తీశ్వరా! 74

చవిగాఁజూడ వినంగ మూర్కొనఁ దనూ సంఘర్షణా స్వాదమొం
ద వినిర్మించెదవేల జంతువుల నేత్రశ్రోత్రాదులే పాతక
వ్యవహారంబులు సేయుదేమిటికి మాయా విద్యచేఁ బ్రొద్దుపు
చ్చి వినోదింపఁగ దీన నేమిఫలమో ? శ్రీకాళహస్తీశ్వరా! 75

వెనుకం జేసిన ఘోరదుర్దశలు భావింపంగ రోఁతయ్యెడున్
వెనుక న్ముందుటవచ్చు దుర్మరణము ల్వీక్షింప భీతయ్యెడున్
నను నేఁజూచియు నావిధుల్దలఁచియు న్నాకే భయం బయ్యెడు
న్జినుకుం జీఁకటి యాయెఁ గాలమునకున్ శ్రీకాళహస్తీశ్వరా! 76

పరిశీలించితి మంత్ర తంత్రములు చెప్పన్వింటి సాంఖ్యాది యో
గ రహస్యంబులు వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంక వో
దరయన్ గుమ్మడి కాయలోన యవగింజంతైన నమ్మించి సు
స్థిర విజ్ఞానము త్రోవఁజూపఁగదవే ! శ్రీకాళహస్తీశ్వరా! 77

మొదలం జేసినవారి ధర్మములు నిర్మూలంబుగాఁ జేసి దు
ర్మదులై యిప్పడు వారి ధర్మము లొనర్పం దమ్ముదైవంబు న
వ్వదె ? రానున్న దురాత్ములెల్లఁ దమత్రోవం బోవరే ? యేల చే
సెదరో మీఁదు దలంచి చూడ కధముల్ శ్రీకాళహస్తీశ్వరా! 78

కాసంతైన సుఖంబొనర్చునో మనఃకామంబు లీడేర్చునో
వీసంబైనను వెంట వచ్చునొ జగద్విఖ్యాతి గావించునో
దోసంబు ల్చెడఁబాపునో వలసినం దోడ్తో మిముంజూపునో
ఛీ ! సంసారదురాశ యేలుడుపవో ? శ్రీకాళహస్తీశ్వరా! 79

ఒకపూఁ టించుక కూడు తక్కువగునే నోర్వంగలేఁ డెండకో
పక నీడ న్వెదకున్ జలిన్ జడిసి కుంపట్లెత్తుకోఁ జూచు వా
నకు నిల్లిల్లను దూఱు నీతనువు దీన న్వచ్చు సౌఖ్యంబు గో
సి కడాసింపరు గాక మర్త్యులకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 80

కేదారాది సమస్త తీర్థములు కోర్కిం జూడఁ బో నేటికిన్
గాదా ముంగిలి వారణాసి కడుపే కైలాసశైలంబు నీ
పాదధ్యానము సంభవించునపుడే భావింప నజ్ఞాన ల
క్ష్మీదారిద్ర్యులుగారె లోకు లకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 81

తమకంబొప్పఁ బరాంగనాజన పరద్రవ్యంబులన్ ముచ్చిలం
గ మహోద్యోగముసేయు నెమ్మనము దొంగంబట్టి వైరాగ్య
పాశములంజుట్టి బిగించి నీదుచరణ స్తంభంబునన్ గట్టి పై
చి ముదం బెప్పడుఁగల్గఁజేయఁగదవే ? శ్రీకాళహస్తీశ్వరా! 82

వేధం దిట్టఁగరాదుగాని భువిలో విద్వాంసులం జేయనే
లా ? ధీచాతురిఁ జేసెఁ జేసినగులా మాపాటనే పోక క్షు
ద్బాధాదుల్ కలిగింపనేల ? యది కృత్యంబైన దుర్మార్గులన్
జే ! ధాత్రీశులఁ జేయనేటి కకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 83

పుడమి న్నిన్నొక బిల్వపత్రమున నేఁబూజించి పుణ్యంబునున్
బడయన్నేరక పెక్కు దైవములకున్ బప్పల్ ప్రసాదంబులున్
గుడుముల్ దోసెలు సారెసత్తు లడుకుల్ గుగ్గిళ్లునుం బెట్టుచున్
జెడి యెందుం గొఱగాకపోదు రకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 84

విత్తజ్ఞానము పాదు చిత్తము భవావేశంబు రక్షాంబువుల్
మత్తత్వంబు తదంకురం బనృతముల్ మఱాకులత్యంత దు
ర్వృత్తుల్పువ్వులు పండ్లు మన్మథ ముఖావిర్భూత దోషంబులున్
జిత్తాభ్యున్నత నింబ భూజమునకున్ శ్రీకాళహస్తీశ్వరా! 85

నీపైఁగావ్యము చెప్పచున్న యతఁడు న్నీపద్యముల్ వ్రాసి యి
మ్మా పారంబొనరింతునన్న యతఁడున్ మంజు ప్రబంధంబు ని
ష్ఠాపూర్తి న్గదియించుచున్న యతఁడు న్సద్బాంధవుల్గాక చీ
చీ పృష్ఠాగత బాంధవంబు నిజమా ? శ్రీకాళహస్తీశ్వరా! 86

సంపద్గర్వముఁ బాఱద్రోలి రిపులన్ జంకించి యాకాంక్షలన్
దంపు ల్వెట్టి కళంకము ల్నఱికి బంధ క్లేశదోషంబులన్
జింపుల్చేసి వయోవిలాసములు సంక్షేపించి భూతంబులన్
జెంపల్వేయక నిన్నుఁగాననగునా ? శ్రీకాళహస్తీశ్వరా! 87

రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరం జేరఁగా సౌఖ్యమో
యీ జన్మంబు తరింపఁ జేయఁగల ని న్నేప్రొద్దు సేవించు ని
ర్వ్యాజాచారము సౌఖ్యమో తెలియలేరా మానవుల్పాపరా
జీజాతాతి మదాంధబుద్ధు లగుచున్ శ్రీకాళహస్తీశ్వరా! 88

నిన్నంజూడరొ మొన్నఁజూడరొ జనుల్ నిత్యంబుఁజావంగ నా
పన్నుల్గన్న నిధానమయ్యెడి ధనభ్రాంతి న్విసర్జింప లే
కున్నా రెన్నఁడు గందురిఁకమర్త్యుల్ గొల్వరేమో నినున్
జిన్నంబుచ్చక ప్రోవకుండు మెడలన్ శ్రీకాళహస్తీశ్వరా! 89

వన్నే యేనుఁగుతోలు దుప్పటము బువ్వా కాలకూటంబు చే
గిన్నే బ్రహ్మకపాల ముగ్రమగు భోగే కంఠహారంబు మే
ల్కి న్నీలాగున నుంటయున్ దెలిసియు న్నీపాదపద్మంబు చే
ర్చె నారాయణుఁడెట్లు మానసముఁ దా శ్రీకాళహస్తీశ్వరా! 90

ద్వారద్వారములందుఁ గంచుకి జనవ్రాతంబు దండంబులన్
దోరంతస్థలి బగ్గనం బొడుచుచున్ దుర్భాషలాడ న్మఱిన్
వారిన్ బ్రార్థనచేసి రాజులకు సేవల్సేయఁగాఁ బోరు ల
క్ష్మీరాజ్యంబును గోరి నీపరిజనుల్ శ్రీకాళహస్తీశ్వరా! 91

ఊరూరం జనులెల్ల భిక్ష మిడరో యుండన్ గుహ ల్గల్గవో
చీరానీకము వీధులం దొరకదో శీతామృతస్వచ్ఛ వాః
పూరం బేఱులఁబాఱదో తపసులం బ్రోవంగ నీవోపవో
చేరం బోవుదురేల రాజుల జనుల్ ? శ్రీకాళహస్తీశ్వరా! 92

దయసేయండని కొందఱాడుదురు నిత్యంబున్నినున్గొల్చుచున్
నియమంబెంతో ఫలంబు నంతియకదా నీవీయ పిండెంతోయం
తియకా యెప్పటికిన్ దళం బశనబుద్ధిం జూడనే లబ్బు ? స
త్క్రియల న్నిన్ను భజింపకిష్టసుఖముల్ శ్రీకాళహస్తీశ్వరా! 93

ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీథి న్మహో
కారోకారమకారయుక్తమగు నోంకారాభిధానంబు చె
న్నారు న్విశ్వ మనంగఁ దన్మహిమచే నా నాదబిందు ల్సుఖ
శ్రీరంజిల్లఁ గడంగు నీవదె సుమీ ! శ్రీకాళహస్తీశ్వరా! 94

నీ భక్తు ల్పదివేలభంగుల నినున్ సేవింపుచున్ వేడఁగా
లోభం బేటికి వారికోర్కులు కృపాళుత్వంబునన్ దీర్ప రా
దా ? భవ్యంబుఁ దలంచిచూడు పరమార్థంబిచ్చిపొమ్మన్న నీ
శ్రీభండారములోఁ గొఱంతపడునా ? శ్రీకాళహస్తీశ్వరా! 95

మొదల న్భక్తుల కిచ్చినాఁడవుగదా మోక్షంబు నేఁడేమయా
ముదియంగా ముదియంగఁబుట్టె ఘనమౌమోహంబు లోభంబు న
న్నది సత్యంబు కృపందలంప పొకపుణ్యాత్ముండు నిన్నాత్మఁ గొ
ల్చి దినంబు న్మొఱవెట్టగాఁ గటకటా ! శ్రీకాళహస్తీశ్వరా! 96

కాలద్వారకవాటబంధనము దుష్కాలప్రమాణక్రియా
లీలాజాలక చిత్రగుప్త ముఖవల్మీకోగ్రజిహ్వోద్భుత
వ్యాళవ్యాళ విరోధి మృత్యుముఖదంష్ట్రాహార్యవజ్రంబు ది
క్చేలాలంకృత నీదునామ మరయన్ శ్రీకాళహస్తీశ్వరా! 97

పదివేలైనను లోకకంటకులచేఁ బ్రాపించు సౌఖ్యంబు నా
మదికిన్ బథ్యముగాదు, సర్వమునకున్ మధ్యస్థుఁడై సత్య దా
న దయాదు ల్గలరాజు నా కొసఁగు మెన్న న్వాని నీయట్ల చూ
చి దినంబు న్ముదమొందుదున్ గడపటన్ శ్రీకాళహస్తీశ్వరా! 98

తాతల్తల్లియుఁ దండ్రియున్మఱియుఁ బెద్దల్చావఁగా చూడరో
భీతిం బొందంగనేల చావునకుఁగాఁ బెండ్లాము బిడ్డల్హిత
వ్రాతంబున్ బలవింప జంతువులకు న్వాలాయమైపోవఁగాఁ
జేతోవీథి నరుండు నిన్గొలువఁడో శ్రీకాళహస్తీశ్వరా! 99

జాతుల్సెప్పుట సేవసేయుట మృషల్ సంధించు టన్యాయ వి
ఖ్యాతిం బొందుట కొండెకాఁడవుట హింసారంభకుం డౌట మి
థ్యా తాత్పర్యము లాడుటన్నియుఁ బరద్రవ్యంబు నాశించి యీ
శ్రీ తా నెన్నియుగంబు లుండఁగలదో శ్రీకాళహస్తీశ్వరా! 100

చెడుగుల్ కొందఱుకూడి చేయఁగఁబనుల్ చీఁకట్లు దూఱఁగఁ బా
ల్పడితిం గాని చరింపరాని నిను నొల్లంజాలుఁ బొమ్మంచు ని
ల్వెడలంద్రోచినఁ జూరుపట్టుకొని నేవ్రేలాడుదుం గోర్కెఁగో
రెడి యర్థంబులు నాకు వే గలుగవో శ్రీకాళహస్తీశ్వరా! 101

భసితోద్ధూళన ధూసరాంగులు జటాభారోత్తమాంగుల్తపో
వ్యసనుల్ సాధితపంచవర్ణరసనుల్ వైరాగ్యవంతుల్ నితాం
త సుఖస్వాంతులు సత్యభాషణ సముద్యద్రత్న రుద్రాక్ష రా
జి సమేతుల్ తుదనెవ్వరైనఁ గొలుతున్ శ్రీకాళహస్తీశ్వరా! 102

జలజశ్రీఁ గల మంచినీళ్ళు గలవా చట్రాతిలో బాపురే!
వెలివాడ న్మతి బాపనిల్లు గలదా వేసాలుగా కక్కటా !
నలి నా రెండుగుణంబు లెంచి మదిలో నన్నేమిరోయంగ నీ
చెలువంబైన గుణంబు లెంచుకొనవే శ్రీకాళహస్తీశ్వరా! 103

గడియల్ రెంటికొ మూఁటికో గడియకో కాదేని నేఁ డెల్లియో
కడఁ నేఁడాదికొ యెన్నఁడో యెఱుఁగ మీకాయంబు లీభూమిపైఁ
బడఁగా నున్నవి ధర్మమార్గమొకటిం బాటింప రీమానవుల్
చెడుగుల్ నీపదభక్తినిం దెలియరో శ్రీకాళహస్తీశ్వరా! 104

క్షితిలో దొడ్డతురంగసామజము లేచిత్రమ్ము లాందోళికా
తతు లే లెక్క విలాసినీజన సువస్త్ర వ్రాతభూషాకలా
ప తనూజాదిక మేమిదుర్లభము నీ పాదమ్ము లర్చించుచో
జిత పంకేరుహపాదపద్మయుగళా ! శ్రీకాళహస్తీశ్వరా! 105

సలిలమ్ము న్జులుక ప్రమాణ మొకపుష్పమ్ము న్భవన్మౌళి ని
శ్చల భక్తి ప్రతిపత్తిచే నరుఁడు పూజల్సేయఁగా ధన్యుఁడౌ
నిల గంగానదిఁ జంద్రఖండమును దానిందుం దుదిన్గాంచు నీ
చెలువంబంతయు నీ మహత్త్వమిదిగా శ్రీకాళహస్తీశ్వరా! 106

తమనేత్రద్యుతిఁ దామెచూడ సుఖమై తాదాత్మ్యము న్పూర్వఁగా
విమలమ్ము ల్కమలాభము ల్జితలసద్విద్యుల్లతా లాస్యముల్
సుమనోబాణ జయప్రదమ్ము లనుచు న్జూచున్ జనంబూని హా
రిమృగాక్షీనివహమ్ము కన్నుఁగవలన్ శ్రీకాళహస్తీశ్వరా! 107

పటవ ద్రజ్జుభుజంగవ ద్రజత విభ్రాంతిస్స్ఫురచ్ఛుక్తి వ
ద్ఘటవ చ్చంద్రశిలా జపాకుసుమ రుక్కాంగత్యవత్తంచు వా
క్పటిమల్నేర్తురు చిత్సుఖం బనుభవింపన్‌లేక దుర్మేధసుల్
చిటుకన్నం దలపోయజూతు రథముల్ శ్రీకాళహస్తీశ్వరా! 108

నిను నిందించిన దక్షుపైఁ దెగవొ వాణీనాధు శాసింపవో
చనువా నీ పదపద్మసేవకులఁ దుచ్ఛంబాడు దుర్మార్గులన్
బెనుప న్నీకును నీదుభక్తతతికిన్ భేదంబు గానంగ వ
చ్చెనొ లేకుండిన నూరకుండఁగలవా ? శ్రీకాళహస్తీశ్వరా! 109

కరిదైత్యు న్దొరిగొన్న శూలము కరగ్రస్తంబుగాదో రతీ
శ్వరుని న్గాల్చిన ఫాలలోచన శిఖావర్గంబు చల్లారెనో
పరనిందాపరుల న్వధింప విదియున్ భావ్యంబె ? వారేమి చే
సిరి నీకున్ బరమోపకార మరయన్ శ్రీకాళహస్తీశ్వరా! 110

దురము న్దుర్గము రాయబారము మహీన్ద్రాంగర్కము న్వైద్య
మున్ నరనాథాశ్రమ మోడబేరమును బెన్మంత్రంబు సిద్ధించినన్,
అరయన్ దొడ్డఫలంబు గల్గు నదిగా కాకార్యమే తప్పినన్
సిరియుం బోవును బ్రాణహానియునగున్ శ్రీకాళహస్తీశ్వరా! 111

తనయుం గాంచి ధనంబు లిచ్చి దివిజస్థానంబు గట్టించి వి
పున కుద్వాహము చేసి సత్కృతికిఁ బాత్రుండై తటాకంబు నే
ర్పునఁ ద్రవ్వించి వనంబువెట్టి మననీ పోలేఁడు నీ సేవ చే
సిన పుణ్యాత్ముఁడు పోవులోకమునకున్ శ్రీకాళహస్తీశ్వరా! 112

క్షితినాథోత్తమ సత్కవీశ్వరుఁడు వచ్చెన్ మిమ్ములం జూడగా
నతఁడే మేటి కవిత్వవైఖరిని సద్యఃకావ్యనిర్మాత త
త్ప్రతిభ ల్మంచివి తిట్టుపద్యములు చెప్పండాతఁడన్నన్ మముం
గ్రితమే చూచెను బొమ్మటందు రథముల్ శ్రీకాళహస్తీశ్వరా! 113

నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిం బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిం బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు నాతనుపుకీలున్ నేర్పులుంగావు చీ
చీ కాలంబులరీతి దప్పెడుఁ జుమీ! శ్రీకాళహస్తీశ్వరా! 114

నిచ్చల్ నిన్ను భజించి చిన్మయ మహానిర్వాణపీఠంబుపై
రచ్చల్సేయక యార్జవంబు కుజనవ్రాతంబుచేఁ గ్రాఁగి భూ
భృచ్ఛండాలురఁ గొల్చి వారు దనుఁ గోపింపం బుధుండార్తుఁడై
చిచ్చారం జము రెల్లఁ జల్లుకొనునో శ్రీకాళహస్తీశ్వరా! 115

దంతంబు ల్పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతా సంఘము రోయనప్పుడే జరాక్రాంతంబు గానప్పుడే
వింత ల్మేన జరింపనప్పుడే కురుల్వెల్వెల్ల గానప్పడే
చింతింపన్వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా! 116

**శ్రీ కాళహస్తీశ్వర శతకము సంపూర్ణము.**



# శ్రీ జ్ఞానప్రసూనాంబికా స్తోత్రము

ఆనందనీం !

శ్లో॥ మాణిక్యాంచిత భూషణాం మణిరవాం మాహేంద్ర నీలోజ్జ్వలాం!
మందారద్రుమ మాల్య భూషిత కచాం మత్తేభకుంభస్త నీం!
మౌనిస్తోమనుతాం మరాళగమనాం మాధ్వీరసానందినీం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥

ఈశ్వరీం !

శ్లో॥ శ్యామాం రాజనిభాననాం రతిహితాం రాజీవపత్రేక్షణాం !
రాజత్కాంచన రత్నభూషణయుతాం రాజ్యప్రదా మీశ్వరీం!
రక్షోగర్వ నివారణీం త్రిజగతీరక్షైక చింతామణీం !
ధ్యాయేచేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం !!

కామేశ్వరీం !

శ్లో॥ కల్యాణీం కరికుంభభాసురకుచాం కామేశ్వరీం ! కామినీం !
కల్యాణాచలవాసినీం కలరవాం కందర్ప విద్యాకళాం !
కంజాక్షీం కలబిందు కల్పలతికాం కామారి చిత్త ప్రియాం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం !!

భవానీం !

శ్లో॥ భావాతీత మనః ప్రభావభరితాం బ్రహ్మాండ భాండోదరీం !
బాలాం బాలకురంగ నేత్రయుగళాం భానుప్రభాభాసితాం !
భాస్వన్నేత్ర రుచాభిరామ నిలయాం భవ్యాం భవానీం ! శివాం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞానప్రసూనాంబికాం ॥

శాంకరీం !

శ్లో॥ వీణాగాన వినోదినీం విజయినీం వేదండ కుంభస్తనీం !
విద్వద్వందిత పాదపద్మయుగళాం విద్యాప్రదాం శాంకరీం !
విద్వేషిణ్యరి భంజనీం శ్రుతిభవాం వేదాంతవేద్యాం శివాం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥

## కైలాసనాథ ప్రియాం !

శ్లో॥ నానాభూషణ భూషితాం ప్రవిమలాం లావణ్యపాథోనిధిం ।
కాంచీ చంచల ఘంటికాకలరవాం కంజాత పత్రేక్షణాం !
కర్పూరాగరు కుంకుమాంకితకుచాం కైలాసనాథ ప్రియాం ।
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥

## మాతంగీం !

శ్లో॥ మంజీరాంచిత పాదపద్మయుగళాం మాణిక్యభూషాన్వితాం !
మందారద్రుమ మంజరీ మధురుఝరీ మాధుర్య కేలద్గిరాం
మాతంగీం మధురాలసాం కరశుకాం నీలాలకాలంకృతాం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥

## ఉమాం !

శ్లో॥ కర్ణాలంబిత హేమకుండల యుగాం కాదంబవేణీ ముమాం !
అంభోజాసన వాసవాది వినుతాం మర్ధేందు భూషోజ్జ్వలాం ।
కస్తూరీ తిలకాభిరామ-నిటలాం గానప్రియాం శ్యామలాం ।
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥

## కౌమారీం !

శ్లో॥ కౌమారీం ! నవపల్లవాంఘ్రి యుగళాం కర్పూర భాసోజ్జ్వలాం ।
గంగావర్త సమాన నాభికుహరాం ! గాంగేయ భూషాన్వితాం !
చంద్రార్కానల కోటి కోటిసదృశాం చంద్రార్క బింబాననాం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥

## అన్నదాన ప్రదాం !

శ్లో॥ బాలాదిత్య నిభాననాం త్రినయనాం బాలేందునాభూషితాం !
నీలాకార సుకేశినీ విలసితాం నిత్యాన్నదానప్రదాం !
శంఖం చక్ర వరాభయంచ దధతీం సారస్వతార్థ ప్రదాం !
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥



